# పాదారవింద శతకమ్ (మూక పంచశతి) భావార్థముతో.

01. మహిమ్నః పంథానం మదనపరిపంథిప్రణయిని
ప్రభుర్నిర్ణేతుం తే భవతి యతమానోఽపి కతమః।
తథాపి శ్రీకాంచీవిహృతిరసికే కోఽపి మనసో
విపాకస్త్వత్పాదస్తుతివిధిషు జల్పాకయతి మామ్॥

కామదేవుడైన మన్మధుని జయించిన ఈశ్వరుని దేవేరివై, కాంచీపురము నందు విహరించు ఓ జగన్మాతా! నీ మహిమను వర్ణించడం ఎటువంటి వారికైనా సాధ్యం కాదు. నా భాగ్యమేమో కానీ, నీ పాదములను స్తుతించాలని నా మనసు పరిపరి విధముల తహతహ లాడుతున్నది.

02. గళగ్రాహీ పౌరందరపురవనీపల్లవరుచాం
ధృతప్రాథమ్యానామరుణమహసామాదిమగురుః।
సమింధే బంధూకస్తబకసహయుధ్వా దిశి దిశి
ప్రసర్పన్కామాక్ష్యాశ్చరణకిరణానామరుణిమా॥

అమ్మా! నీ పాదములనుండి వెలువడే ఎర్రని కాంతి సమూహము, దేవేంద్రుని ఉద్యానవనములోని కల్పవృక్షముయొక్క లేత ఆకుల వర్ణమును, అప్పుడే ఉదయిస్తున్న భానుని ఎరుపు కాంతిని, మంకెన పుష్పముల రక్తవర్ణమును త్రోసిరాజని అత్యంత ప్రకాశవంతముగా ఉన్నది.

03. మరాలీనాం యానాభ్యసనకలనామూలగురవే
దరిద్రాణాం త్రాణవ్యతికరసురోద్యానతరవే।
తమస్కాండప్రౌఢిప్రకటనతిరస్కారపటవే
జనోఽయం కామాక్ష్యాశ్చరణనలినాయ స్పృహయతే॥

జగన్మాతా! నీ పాదములు ఆడు నెమళ్లకు నడకలు నేర్పిన గురువులు. దీనులకు కల్పతరువులు నీ పాదములు. తిమిరాంధకారమును తరిమివేయగలవి నీ పాదములు. ఆ పాద పద్మములను గూర్చి నాకు ఎరుక పరచవా తల్లీ!

04. వహంతీ సైందూరీం సరణిమవనమ్రామరపురీ-
పురంధ్రీసీమంతే కవికమల బాలార్కసుషమా।
త్రయీసీమంతిన్యాః స్తనతటనిచోలారుణపటీ
విభాంతీ కామాక్ష్యాః పదనలిన కాంతిర్విజయతే॥

అమ్మా! దేవతా స్త్రీలందరూ వంగి నీ పాదాలకు ప్రణమిల్లుతుంటే, వారి సింధూర కాంతి ప్రకాశము నీ పాదములలో మిళితమయింది. కవులలో కవిత్వ భావనలు వికసించడానికి నీ పాదములు బాలభానుని కిరణములైనాయి. వేదములు అనే పుణ్య స్త్రీల హృదయ కాంతి సారమే నీ పాదములు.

05. ప్రణమ్రీభూతస్య ప్రణయ కలహాత్రస్త మనసః
స్మరారాతేశ్చూడావియతి గృహమేధీ హిమకరః।
యయోః సాంధ్యా కాంతిం వహతి సుషమాభిశ్చరణయోః
తయోర్మే కామాక్ష్యా హృదయమపతంద్రం విహరతామ్॥

పార్వతీ దేవితో ప్రణయ కలహములో ఈశ్వరుడు జగదాంబ పాదముల పై వాలాడు. అప్పుడు ఈశ్వరుని సిగలో ఉన్న చంద్రుడు, అమ్మ పాదముల కాంతులను అంది పుచ్చుకుని అలౌకిక కాంతితో ప్రకాశించాడు. అటువంటి అమ్మ దివ్య పాదములు నా మానసిక అంతరంగములో తిరుగాడుగాక.

06. యయోః పీఠాయంతే విబుధముకుటీనాం పటలికా
యయోః సౌధాయంతే స్వయ ముదయభాజో భణితయః।
యయోః దాసాయంతే సరసిజభవాద్యాశ్చరణయోః
తయోర్మే కామాక్ష్యా దినమను వరీవర్తు హృదయమ్॥

సకల దేవతల కిరీటములు అమ్మకు పాదపీఠముగా ఏర్పడినాయి. చతుర్వేదముల సారమే అమ్మ పాదములు. కమలములోనుంచి ఉద్భవించిన బ్రహ్మదేవుడు, ఇతర దేవతలు అమ్మకు దాసానుదాసులు. అట్టి అమ్మ పాదయుగళమందు నా హృదయము నిత్యనివాసముండుగాక!

07. నయంతీ సంకోచం సరసిజరుచం దిక్పరిసరే
సృజంతీ లౌహిత్యం నఖకిరణచంద్రార్ధఖచితా।
కవీంద్రాణాం హృత్కై రవవికసనోద్యోగజననీ
స్ఫురంతీ కామాక్ష్యాః చరణరుచిసంధ్యా విజయతే.

పద్మముల యొక్క కాంతిని తిరస్కరిస్తూ, కేవలము తన పాదనఖములనుండి అరుణారుణ కాంతులను ప్రసరింపచేస్తూ, కవుల మానస సరోవరములో కలువలను పూయిస్తూ, కామాక్షీ దేవి పాదముల కాంతులు ప్రకాశిస్తున్నాయి.

08. విరావైర్మాంజీరైః కిమపి కథయంతీవ మధురం
పురస్తాదానమ్రే పురవిజయిని స్మేరవదనే।

వయస్యేవ ప్రౌఢా శిథిలయతి యా ప్రేమకలహ
ప్రరోహం కామాక్ష్యాః చరణయుగళీ సా విజయతే॥

ఈ వింతను తిలకించండి. జగన్మాత అలక తీర్చడానికి ఈశ్వరుడు మోకరిల్లాడు. అప్పుడు అమ్మ పాదముల అందెలు చేసిన శబ్దంతో ఆమె మాట్లాడిందని భ్రాంతి కలిగి చిరునవ్వు చిందించాడు శివుడు. వారిద్దరి మధ్య ప్రణయ కలహాన్ని తీర్చుటలో మధ్యవర్తులైన పాదములు నాలో నిత్యము వసించుగాక.

09. సుపర్వస్త్రీలోలాలకపరిచితం షట్పదకులైః
స్ఫురల్లాక్షారాగం తరుణతరణిజ్యోతిరరుణైః।
భృతం కాంత్యంభోభిః విసృమరమరందైః సరసిజైః
విధత్తే కామాక్ష్యాః చరణయుగళం బంధుపదవీమ్॥

దేవతా స్త్రీలు అమ్మ పాదాములకు ప్రణమిల్లుతుంటే, వారి కేశములు తుమ్మెదలవలె తిరుగాడుతున్నాయి. ఆమె పాదములపై ఉన్న లత్తుకతో పద్మములు ఎర్రగా ప్రకాశిస్తున్నాయి. ఆ తల్లి పాదములనే పద్మములు అమృత రసాన్ని చిలకరిస్తున్నాయి.

10. రజఃసంసర్గేపి స్థితమరజసామేవ హృదయే
పరం రక్తత్వేన స్థితమపి విరక్తైకశరణమ్।
అలభ్యం మందానాం దధదపి సదా మందగతితాం
విధత్తే కామాక్ష్యాః చరణయుగమాశ్చర్యలహరీమ్॥

జగన్మాత పాద పద్మములలో ఉన్న రజస్సు, రజోగుణరహితుల హృదయములో వసించి, ఆ పాదములలో ఉన్న రక్తి కేవలము విరక్తుల హృదయములో స్థితమై, అమ్మ పాదముల మందగతి, మంద బుద్ధి కలవారికి, భక్తి లేనివారికి లభ్యం కాకుండా ఉంటాయి.

11. జటాలా మంజీరస్ఫురదరుణరత్నాంశునికరైః
నిషిదంతీ మధ్యే నఖరుచిఝరీగాంగపయసామ్॥
జగత్త్రాణం కర్తుం మమ జనని కామాక్షి నియతం
తపశ్చర్యాం ధత్తే తవ చరణపాథోజయుగళీ॥

జగన్మాతా! నీ కాలి అందియలలో కూర్చబడిన ఎర్రటి రత్నములు నీ పాదములకు కేశములవలె అమరి ఉన్నాయి. నీ పాద నఖములనుండి వెలువడుతున్న వెన్నెల కాంతులు గంగా నదీ ప్రవాహమువలే దృశ్యమై, జటలతో కూడి నదీమధ్యమున స్థితమైన నీ పాదములు, సకల జగత్తును రక్షిస్తున్న తాపసివలె కనిపిస్తున్నాయి.

12. తులాకోటిద్వంద్వక్కణితభణితాభీతివచసో:
విన్రమం కామాక్షి విసృమరమహఃపాటలితయో:।
క్షణం విన్యాసేన క్షపితతమసోర్మే లలితయో:
పునీయాన్మూర్ధానం పురహరపురంధ్రీ చరణయో:॥

అమ్మా! నీ పాదములు నా శిరసుపై అమృత జలమును చల్లి, నా శిరసుపై నిలచి నాకు అభయప్రదానము చేయుగాక. నీ పాదములకు ఉన్న అందెల మధుర ధ్వనులు నాకు ధైర్యప్రదాయకములు. నీ పాద జలములు నా మనసులోని మలినములను తొలగించే మధుర రసములు.

13. భవాని ద్రుహ్యేతాం భవనిబిడితేభ్యో మమ ముహు
స్తమోవ్యామోహేభ్యస్తవ జనని కామాక్షి చరణౌ।
యయోర్లాక్షాబిందుస్ఫురణధరణాద్ధూర్జటిజటా–
కుటీరా శోణాంకం వహతి వపురేణాంకకలికా॥

అమ్మా భవానీ, ఈశ్వరుని జటాజూటములో నీవు ఒక మొగ్గవై ఉన్నావు. ప్రణయ సమయములో నీ పాదములను తాకిన శివుని ముఖముపై అలముకున్న నీ పాదముల లత్తుక ఎర్రని తిలకమువలె భాసిస్తున్నది. అటువంటి నీ పాదములు నా తమో గుణమును నశింపచేయుగాక.

14. పవిత్రీకుర్యుర్నః పదతలభువః పాటలరుచః
పరాగాస్తే పాపప్రశమనధురీణాః పరశివే।
కణం లబ్ధుం యేషాం నిజశిరసి కామాక్షి వివశా
వలంతో వ్యాతన్వంత్యహమహమికాం మాధవముఖాః॥

జగన్మాతా! నీ పాదములపై ఉన్న ధూళి కణములను తమ శిరసుపై ధరించాలని, బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలంతా, ఒకరినొకరు తోసుకుంటూ ప్రయత్నిస్తున్నారు. నీ అరుణ పాదముల ధూళి కణములు నా శిరసుపై పడి నన్ను పవిత్రుని చేయుగాక.

15. బలాకామాలాభిర్నఖరుచిమయీభిః పరివృతే
విన్రమస్వర్నారీవికచకచకాలాంబుదకులే।
స్ఫురంతః కామాక్షి స్ఫుటదలితబంధూకసుహృద–
స్తటిల్లేఖాయంతే తవ చరణపాథోజకిరణాః॥

జగన్మాతా! దేవలోకములోని స్త్రీలు, నీకు పాదనమస్కారము చేసే సమయంలో వారి నల్లని కేశపాశములు మేఘములవలె, నీ పాదముల నఖముల తెల్లని కాంతి ఆ మేఘములలో విహరించే కొంగల గుంపువలె, తెల్లని మెరుపులవలె గోచరించు చున్నది.

16. సరాగః సద్వేషః ప్రసృమరసరోజే ప్రతిదినం
నిసర్గాదాక్రామన్విబుధజనమూర్ధానమధికమ్।
కథంకారం మాతః కథయ పదపద్మస్తవ సతాం
నతానాం కామాక్షి ప్రకటయతి కైవల్యసరణిమ్॥

ఓ కామాక్షీ! నీ పాదపద్మములు, పద్మముల కాంతిని తిరస్కరించాయి. నీ పాదపద్మముల కాంతిని సకల దేవతలు, విజ్ఞులు శిరసున దాల్చారు. అలాంటి నీ పాదములు, నీ శరణు కోరినవారికి ముక్తిని ప్రసాదించడం మా భాగ్యము కాక మరేమిటి.

17. జపాలక్ష్మీశోణో జనితపరమజ్ఞాననలినీ-
వికాసవ్యాసంగో విఫలితజగజ్జాడ్యగరిమా।
మనఃపూర్వాద్రిం మే తిలకయతు కామాక్షి తరసా
తమస్కాండద్రోహీ తవ చరణపాథోజరమణః॥

కామాక్షీ! నా మనసు అనే తూర్పువైపు కొండలలోనుండి నీ పాదములనే సూర్యబింబము ఉదయిస్తుంది. సూర్యుడు, ఈ ప్రపంచము యొక్క అంధకారమును తొలగిస్తే, నీ పాదములనే సూర్యుడు, నా మనసులోని అజ్ఞానపు చీకట్లను పారద్రోలుతాడు.

18. నమస్కుర్మః ప్రేంఖన్మణికటకనీలోత్పలమహః-
పయోధౌ రింఖద్భిర్నఖకిరణఫేనైర్ధవళితే।
స్ఫుటం కుర్వాణాయ ప్రబలచలదౌర్వానలశిఖా-
వితర్కం కామాక్ష్యాః సతతమరుణిమ్నే చరణయోః॥

తల్లీ! నీ నూపురములోని నీలపు వర్ణ మణిమాణిక్యముల ప్రకాశము సాగరమైతే, నీ పాదనఖముల ప్రకాశము ఆ సముద్రముపై తేలియాడే నురగలు. నీ పాదములనుండి వెలువడే అరుణవర్ణపు కాంతి ఆ సాగరములో ఉద్భవించే బడబాగ్ని. అమ్మా! నీ పాదములకు నా ప్రణతులు.

19. శివే పాశాయేతామలఘుని తమఃకూపకుహరే
దినాధీశాయేతాం మమ హృదయపాథోజవిపినే।
నభోమాసాయేతాం సరసకవితారీతిసరితి
త్వదీయౌ కామాక్షి ప్రసృతకిరణౌ దేవి చరణౌ॥

అమ్మా శివా! నేను అజ్ఞానమనే ఒక గుహలో చిక్కుకుని ఉన్నాను. నీ చరణముల యొక్క ప్రకాశము ఆ చీకటి గుహనుండి ఒక త్రాడువలె నన్ను బయటకు లాగుగాక. అమ్మా! నీ పాదములు నా మనసనే కమలమును వికసింపజేయుగాక. కవితా ధారలు నా నుండి వర్షపు ధారలై వెలువడుగాక.

20. నిషక్తం శ్రుత్యంతే నయనమివ సద్వృత్తరుచిరైః
సమైర్జుష్టం శుద్ధైరధరమివ రమ్యైర్ద్విజగణైః।
శివే వక్షోజన్మద్వితయమివ ముక్తాశ్రితముమే
త్వదీయం కామాక్షి ప్రణతశరణం నౌమి చరణమ్॥

అమ్మా! నీ నేత్రములు కర్ణములవరకు విస్తరించాయి. నీ పాదములు వేదముల అంచులను స్పృశిస్తున్నాయి. సుందరమైన నీ ఓష్టములు అందమైన పలువరుసతో స్నేహం చేస్తున్నాయి. నీ పాదములు సత్ప్రవర్తనులై, జ్ఞానులైన వారితో చెలిమి చేసేవారికి ముక్తిని ప్రసాదిస్తున్నాయి.

21. నమస్యాసంసజ్జన్న ముచిపరిపంథిప్రణయినీ-
నిసర్గప్రేంఖోలత్కురలకులకాలాహిశబలే।
నఖచ్ఛాయాదుగ్ధోదధిపయసి తే వైద్రుమరుచాం
ప్రచారం కామాక్షి ప్రచురయతి పాదాబ్జసుషమా॥

అమ్మా! ఇంద్రపత్ని శచీదేవి, నీ పాదములకు ప్రణమిల్లినపుడు, ఆమె ముంగురులు, పాలసముద్రమువంటి నీ పాదములపై తేలియాడుచున్న నాగులవలె కనిపించు చున్నవి. ఇక నీ ఎర్రని పాదముల కాంతి క్షీరసముద్రముపై అనేకమైన పగడములవలె ప్రతిబింబించు చున్నది.

22. కదా దూరీకర్తుం కటుదురిత కాకోలజనితం
మహాంతం సంతాపం మదనపరిపంథిప్రియతమే।
క్షణాత్తే కామాక్షి త్రిభువనపరీతాప హరణే
పటీయాంసం లప్స్యే పదకమలసేవామృత రసమ్॥

శివప్రియా! ఓ కామాక్షీ! పాపకృత్యములచే బాధలు కలిగినప్పుడు దానినుండి దుఃఖము కలుగుతుంది. ఈ దుఃఖమును దూరము చేయడానికి నీ పాదసేవామృత పానమే శరణ్యము. ఆ భాగ్యము నాకు ఎప్పుడు కలుగుతుంది తల్లీ.

23. యయోః సాంధ్యం రోచిః సతతమరుణిమ్నే స్పృహయతే
యయోశ్చాంద్రీ కాంతిః పరిపతతి దృష్ట్వా నఖరుచిమ్।

యయోః పాకోద్రేకం పిపఠిషతి భక్త్యా కిసలయం
మ్రదిమ్నః కామాక్ష్యా మనసి చరణౌ తౌ తనుమహే॥

జగన్మాతా! ఎర్రని సంధ్యాప్రకాశము, నీ పాదములవంటి ఎరుపు రంగును వాంఛిస్తుంది. వెన్నెల అంటావా, నీ నఖముల తెల్లని కాంతిని పొందాలనుకుంటుంది. లేలేత చిగురుటాకులు, నీ పాదములంత మృదువుగా ఉండాలనుకుంటాయి. అటువంటి పాదాలను నిత్యం స్మరిస్తాను.

24. జగన్నేదం నేదం పరమితి పరిత్యజ్య యతిభిః
కుశాగ్రీయస్వాంతైః కుశలధిషణైః శాస్త్రసరణౌ।
గవేష్యం కామాక్షి ధ్రువమకృతకానాం గిరిసుతే
గిరామైదంపర్యం తవ చరణపద్మం విజయతే॥

ఓ గిరిరాజపుత్రీ! జ్ఞానులు, తపస్సంపన్నులైనవారు జగత్తులోని ప్రతి విషయమును సత్యముగా కాక మిధ్యగానే భావిస్తారు. వేదములు మాత్రం నీ పాదములే గొప్పవని ఎలుగెత్తి ఘోషించుచున్నవి.

25. కృతస్నానం శాస్త్రామృతసరసి కామాక్షి నితరాం
దధానం వైశద్యం కలితరసమానందసుధయా।
అలంకారం భూమేర్మునిజనమనశ్చిన్మయమహా-
పయోధేరంతస్స్థం తవ చరణరత్నం మృగయతే॥

అమ్మా! నాకు నీ పాద దర్శనము కాలేదు. నీ పాద పద్మములు ఎక్కడ ఉన్నాయో వెతుకగా, శాస్త్రజ్ఞానములో అమృత స్నానమాచరించి, రససారవంతమై, ఈ పృధ్వికే భూషణమై, మునీశ్వరుల హృదయమనే సముద్రములో దాగి ఉన్నాయవి.

26. మనోగేహే మోహోద్భవతిమిరపూర్ణే మమ ముహుః
దరిద్రాణీకుర్వన్దినకరసహస్రాణి కిరణైః।
విధత్తాం కామాక్షి ప్రసృమరతమోవంచనచణః
క్షణార్ధం సాన్నిధ్యం చరణమణిదీపో జనని తే॥

అమ్మా! నా మనసనే గృహము, మోహమనే అంధకారముతో నిండి ఉన్నది. కేవలము వేలాది సూర్యకాంతుల ప్రభలు కల నీ పాదములనే దీపకాంతులే ఆ తిమిరమును తరిమి వేయగలవు. అటువంటి దీపములను నా మనసులో కొద్దిసేపైనా వెలిగించు తల్లీ.

27. కవీనాం చేతోవన్నఖరరుచిసంపర్కి విబుధ-
స్రవంతీస్రోతోవత్పటుముఖరితం హంసకరవైః।


Kiron Type Institute

దినారంభశ్రీవన్నియతమరుణచ్ఛాయసుభగం
మదంతః కామాక్ష్యాః స్ఫురతు పద పంకేరుహయుగమ్॥

అరుణారుణ కాంతులతో ప్రకాశిస్తూ, చంద్రకాంతివలె చల్లనై, హంసధ్వనులను పోలిన అందెల సవ్వడులతో ప్రతిధ్వనిస్తూ, ప్రాతఃకాల శోభతో ఉండే నీ పాద పద్మములు నా మనసులో నిత్య నివాసముందుగాక.

28. సదా కిం సంపర్కాత్ప్రకృతికఠినైర్నాకిముకుటైః
తటైర్నీహారాద్రేరధికమణునా యోగిమనసా।
విభింతే సమ్మోహం శిశిరయతి భక్తానపి దృశామ్
అదృశ్యం కామాక్షి ప్రకటయతి తే పాదయుగళమ్॥

ఓ కామాక్షీ! నీ పాదములకు దేవతలు నమస్కరించినపుడు, వారి కిరీటముల ఒరిపిడికి అవి రాటుదేలిపోయాయి. కానీ హిమాలయ సానువులపై సంచరించిన పాదములు, శీతలమై యోగుల హృదయములను చల్లబరుస్తూ, నిన్ను దర్శింప చేస్తున్నాయి.

29. పవిత్రాభ్యామంబ ప్రకృతి మృదులాభ్యాం తవ శివే
పదాభ్యాం కామాక్షి ప్రసభమభిభూతైః సచకితైః।
ప్రవాలైరంభోజైరపి చ వనవాసవ్రతదశాః
సదైవారభ్యంతే పరిచరితనానాద్విజగణైః॥

అమ్మా! నీ పాదముల మృదుత్వముచే తిరస్కరించబడిన లేత ఆకులు, కమలములు వనవాస దీక్ష చేయదలచి, ఆకులేమో అడవులలోనూ, కమలములేమో నీటిలోను వనవాస దీక్ష చేయదలచి, ముందుగా బ్రాహ్మణులను ఆరాధించసాగాయి.

30. చిరాద్దృశ్యా హంసైః కథమపి సదా హంససులభం
నిరస్యంతీ జాడ్యం నియతజడమధ్యైకశరణమ్।
అదోషవ్యాసంగా సతతమపి దోషాప్తిమలినం
పయోజం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగలీ॥

అమ్మా! ఈ లోకములోని పద్మములు నీ పాదముల ముందు దిగదుడుపే. ఎందుకంటే పద్మములు రాత్రి వేళలలో ముడుచుకుంటాయి. నీ పాదములు ఎప్పటికీ ముడుచుకోవు. పద్మములు ఎప్పుడు హంసలకు లభ్యమే. కానీ నీ పాదపద్మములు మాత్రం యోగులకు ఎప్పుడో కానీ దర్శనమివ్వవు.

31. సురాణామానందప్రబలనతయా మండనతయా
నఖేందుజ్యోత్స్నాభిర్విసృమరతమఃఖండనతయా।
పయోజశ్రీద్వేషవ్రతరతతయా త్వచ్చరణయోః
విలాసః కామాక్షి ప్రకటయతి నైశాకరదశామ్॥

అమ్మా! నీ పాదములకు, చంద్రునికి ఎంతో సామ్యమున్నది. చంద్రుడు వెన్నెలను కురిపించడంతోపాటు, అమృత ధారలను కురిపించి దేవతలకు ఆహ్లాదం కలుగచేస్తాడు. నీ పాదాలు, తన గోటి నఖములతో చీకట్లను తరిమివేసి, దేవతలకు ఆనందాన్ని కలుగచేస్తాయి.

32. సితిమ్నా కాంతీనాం నఖరజనుషాం పాదనళిన-
చ్ఛవీనాం శోణిమ్నా తవ జనని కామాక్షి నమనే।
లభంతే మందారగ్రథితనవబంధూక కుసుమ-
స్రజాం సామీచీన్యం సురపురపురంధ్రీకచభరాః॥

జగన్మాతా, దేవతాస్త్రీలు నీ పాదములకు ఎందుకు నమస్కరిస్తారో తెలుసా. నీ పాదముల ఎరుపువర్ణము, నీ కాలి గోళ్ళ తెలుపువర్ణముతో మందార, మంకెన పుష్పములు రెండిటి కాంతులు కల పుష్పములు వారి సిగలోనికి లభిస్తాయి.

33. స్ఫురన్మధ్యే శుద్ధే నఖకిరణదుగ్ధాబ్ధిపయసాం
వహన్నబ్జం చక్రం దరమపి చ లేఖాత్మకతయా।
శ్రితో మాత్స్యం రూపం శ్రియమపి దధానో నిరుపమాం
త్రిధామా కామాక్ష్యాః పదనలిననామా విజయతే॥

అమ్మా! విష్ణుమూర్తి స్వయముగా నీ పాదపద్మములుగా ఏర్పడినాడు. ఆయన మత్స్యావతార రూపముగా నీ పాదములో ఉండి, క్షీరసముద్ర జల మధ్యములో శ్రీ మహాలక్ష్మితో కలసి నీ పాదములలో నిలచాడు.

34. నఖశ్రీసన్నద్ధస్తబకనిచితః స్వైశ్చ కిరణైః
పిశంగైః కామాక్షి ప్రకటితలసత్పల్లవరుచిః।
సతాం గమ్యః శంకే సకలఫలదాతా సురతరుః
త్వదీయః పాదోయం తుహినగిరిరాజన్యతనయే॥

హిమవత్పుత్రీ! ఓ కామాక్షీ! నీ పాద నఖముల కాంతులు పువ్వుల గుత్తులు అయితే, నీ పాదముల ఎర్రని కాంతి లేలేత చిగురు ఆకులు. అవి భక్తులకు సకల కోరికలను తీరుస్తాయి. దీనిని గమనిస్తే, నీ పాదములు భక్తుల పట్ల, సాధువల పట్ల కల్పవృక్షమే కదా.

35. వషట్కుర్వన్మాంజీరజకలకలైః కర్మలహరీ-
హవీంషి ప్రోద్ధండం జ్వలతి పరమజ్ఞానదహనే।
మహీయాన్కామాక్షి స్ఫుటమహని జోహోతి సుధియాం
మనోవేద్యాం మాతస్తవ చరణయజ్వా గిరిసుతే॥

జగన్మాతా! నీ పాదములు యజ్ఞ కుండములో హోమమును ఆచరించే కర్త అయితే, నీ పాదముల అందియల స్వరములు వేదమంత్రములు. జీవుల కర్మములే యజ్ఞములో వేసే హవిర్భాగములు. మండుతున్న అగ్ని జ్ఞానము. సద్గుణుల హృదయమే హోమవేదిక. యజ్ఞకర్త సాక్షాత్తు నీ రూపమే.

36. మహామంత్రం కించిన్మణికటకనాదైర్మృదు జపన్
క్షిపందిక్షు స్వచ్ఛం నఖరుచిమయం భాస్మనరజః।
నతానాం కామాక్షి ప్రకృతిపటురుచ్చాట్య మమతా-
పిశాచీం పాదోయం ప్రకటయతి తే మాంత్రికదశామ్॥

అమ్మా! నీ పాదుములు ఒక మహా మాంత్రికుడు. ఆ పాదముల అందెల ధ్వనులు మహా మంత్రములుగా, ఆ మాంత్రికుడు, నీ పాదనఖముల తెల్లని భస్మముతో, మమత్వము అనే పిశాచమును తొలగిస్తాడు. దుష్టశక్తులనుండి రక్షణకు నీ పాదములే శరణము.

37. ఉదీతే బోధేందౌ తమసి నితరాం జగ్మషిదశాం
దరిద్రాం కామాక్షి ప్రకటమనురాగం విదధతీ।
సితేనాచ్ఛాద్యాంగం నఖరుచిపటేనాంఘ్రియుగళీ-
పురంధ్రీ తే మాతః స్వయమభిసరత్యేవ హృదయమ్॥

మాతా! నా సాధనతో, నాలో ఉన్న అజ్ఞానము నెమ్మదిగా తొలగిపోతుండగా, జ్ఞానోదయం కలుగుతుండగా, నీ పాద నఖములనే తెల్లని వస్త్రముగా ధరించి, ఒక స్త్రీ మూర్తి నన్ను వెదకుతూ, స్వయముగా నా హృదయములో ప్రవేశిస్తుందమ్మా.

38. దివారంభః సంపన్నళినవిపి నానామభినవో
వికాసో వాసంతః సుకవిపికలో కస్య నియతః।
ప్రదోషః కామాక్షి ప్రకటపరమజ్ఞానశశిన-
శ్చకాస్తి త్వత్పాదస్మరణమహిమా శైలతనయే॥

ఓ హిమగిరితనయా! పద్మములు వికసించడానికి సూర్యకాంతి ఎంత అవసరమో, మాలో జ్ఞానసంపద వృద్ధి పొందటానికి నీ పాదములు అంతే అవసరము. నీ పాదములు వసంత

ఋతువులో కోయిల లాగా, రాత్రిపూట ఉదయించే చంద్రునిలాగా మాలో జ్ఞానమును పెంపొందింపచేస్తాయి.

39. ధృతచ్ఛాయం నిత్యం సరసిరుహమైత్రీపరిచితం
నిధానం దీప్తీనాం నిఖిలజగతాం బోధజనకమ్।
ముముక్షూణాం మార్గప్రథనపటు కామాక్షి పదవీం
పదం తే పాతంగీం పరికలయతే పర్వతసుతే॥

మాతా! ముక్తిని పొందినవారు, సూర్యమండలము ద్వారా మోక్షమును చేరు కుంటారు. నీ పాదములు ధృతి అనే ఛాయతో కలసి ధైర్యమును ప్రసాదించడమే కాక జీవులకు జ్ఞానముతో పాటు మోక్షమార్గమును దర్శింపచేస్తాయి.

40. శనైస్తీర్త్వా మోహాంబుధిమథ సమారోఢుమనసః
క్రమాత్కైవల్యాఖ్యాం సుకృతిసులభాం సౌధవలభీమ్।
లభంతే నిఃశ్రేణీమివ ఝటితి కామాక్షి చరణం
పురశ్చర్యాభిస్తే పురమథనసీమంతిని జనాః॥

మాతా కామాక్షీ! పవిత్రమైన నీ మంత్రములను నిత్యము జపించే ఉపాసకులు సంసార సాగరమును దాటి, మోక్షపదవి అనే భవనమును అధిరోహించడానికి, నీ పాదములను నిచ్చెనలాగ, ఆసరా చేసుకుంటారు.

41. ప్రచండార్తిక్షోభప్రమథనకృతే ప్రాతిభసరి-
త్ప్రవాహప్రోద్ధండీకరణజలదాయ ప్రణమతామ్।
ప్రదీపాయ ప్రౌఢే భవతమసి కామాక్షి చరణ-
ప్రసాదౌన్ముఖ్యాయ స్పృహయతి జనోఽయం జనని తే॥

జగన్మాతా! ప్రచండమైన ఆపదలలో చిక్కుకుని, వాటిని తొలగించుకొనుటకు నీ శరణు కోరినవారికి, జ్ఞానము అనే నది ప్రవహించుటకు మేఘములైనవి, సంసారము అనే తిమిరాంధకారములో దీపములైనవి, అయిన నీ పాదముల దయ మాపై ప్రసరించుగాక.

42. మరుద్భిః సంసేవ్యా సతతమపి చాంచల్యరహితా
సదారుణ్యం యాంతీ పరిణతిదరిద్రాణసుషమా।
గుణోత్కర్షాన్మాంజీరకకలకలైస్తర్జనపటుః
ప్రవాలం కామాక్ష్యాః పరిహసతి పాదాబ్జయుగలీ॥

అమ్మా! లేత చిగురుటాకులు కొన్నాళ్ళకి పండి రాలిపోతాయి. నీ పాదములు ఎప్పటికీ నవనవోన్మేషములు. చిగురుటాకులవలే కాక నీ పాదములు ఎప్పుడూ ఎరుపు వర్ణముతో ఉండి మమ్ములను అనుగ్రహిస్తాయి.

43. జగద్రక్షాదక్షా జలజరుచిశిక్షాపటుతరా
సురైర్నమ్యా రమ్యా సతతమభిగమ్యా బుధజనైః।
ద్వయీ లీలాలోలా శ్రుతిషు సురపాలాదిముకుటీ-
తటీసీమాధామా తవ జనని కామాక్షి పదయోః॥

జగన్మాతా! సకల జగత్తులను రక్షించగలవి, పద్మముల కాంతిని తిరస్కరించునవి, దేవతలచే నమస్కరించబడునవి, జ్ఞానులచే ఎల్లప్పుడు కోరబడునవి, వేదములచే స్తుతించబడునవి, దేవతల కిరీటములు పాద పీఠములుగా కలవి అయిన నీ పాదములకు జయజయధ్వానములు పలుకుతున్నాను.

44. గిరాం దూరౌ చోరౌ జడిమతిమిరాణాం కృతజగ-
త్పరిత్రాణౌ శోణౌ మునిహృదయలీలైకనిపుణౌ।
నఖైః స్మేరౌ సారౌ నిగమవచసాం ఖండితభవ-
గ్రహోన్మాదౌ పాదౌ తవ జనని కామాక్షి కలయే॥

అమ్మా! నీ పాదములను వర్ణించడం ఆదిశేషునకైనా తరమా! అజ్ఞానమును పారద్రోలేవి, జగద్రక్షణములు, యోగుల హృదయములలో నివసించేవి, సమస్త వేదసారములైనవి, సాంసారిక బాధలను తొలగించేవి అయిన నీ దివ్య పాదములను నిరంతరము ధ్యానిస్తున్నాను.

45. అవిశ్రాంతం పంకం యదపి కలయన్యాపకమయం
నిరస్యన్కామాక్షి ప్రణమనజుషాం పంకమఖిలమ్।
తులాకోటీద్వంద్వం దధదపి చ గచ్ఛన్నతులతాం
గిరాం మార్గం పాదో గిరివరసుతే లంఘయతి తే॥

మాతా! నీ పాదములపై నిత్యము అలంకరింపబడే లత్తుక నిన్ను శరణన్న మా పాప పంకిలమును తొలగిస్తుంది. అందియములను ధరించిన సాటిలేని నీ పదములు ఈ జగత్తులో ఎవరికీ లొంగక అన్నిటికీ అతీతముగా ఉంటాయి.

46. ప్రవాళమ్ సవ్రీలం విపినవివరే వేపయతి యా
స్ఫురల్లీలం బాలాతపమధికబాలం వదతి యా।
రుచిం సాంధ్యాం వంధ్యాం విరచయతి యా వర్ధయతు సా
శివం మే కామాక్ష్యాః పదనళినపాటల్యలహరీ॥

అమ్మా! నీ పాదములు లేలేత చిగురుటాకులను అడవిలో తలదాచుకొమ్మనీ, సూర్యకాంతిని తిరస్కరిస్తూ, సంధ్యాకాంతులను త్రోసి రాంటున్నాయి. అట్టి కాంతి వంతమైన నీ పాదములు ఎల్లప్పుడు మాకు శుభమును ప్రసాదించుగాక.

47. కిరన్జ్యోత్స్నా రీతిం నఖముఖరుచా హంసమనసాం
వితన్వానః ప్రీతిం వికచతరుణాంభోరుహరుచిః।
ప్రకాశః శ్రీపాదస్తవ జనని కామాక్షితనుతే
శరత్కాలప్రౌఢిం శశిశకలచూడప్రియతమే॥

అమ్మా! శివప్రియా! కామాక్షీ! వెన్నెల ప్రకాశమును నీ పాదనఖములచే త్రోసివేస్తూ, యోగుల మనసులకు రాచహంసలవలే ఆనందాన్ని కలుగచేస్తూ, శరత్కాలములో విస్తరిస్తున్న పద్మములవలే, నీ పాదములు మాకు ఆనందమును కలుగజేయుగాక.

48. నఖాంకూరస్మేరద్యుతివిమలగంగాంభసి సుఖం
కృతస్నానం జ్ఞానామృతమమలమాస్వాద్య నియతమ్।
ఉదంచన్మంజీరస్ఫురణమణిదీపే మమ మనో
మనోజ్ఞే కామాక్ష్యాశ్చరణమణిహర్మ్యే విహరతామ్॥

అమ్మా! చిరునవ్వుతో కూడిన మొగ్గలవంటి నీ పాద నఖముల కాంతులు, మణిదీపములవలే ప్రకాశిస్తున్న నీ కాలి అందియలతో కూడిన నీ పాదములు నా హృదయములో నిత్యము వసించుగాక.

49. భవాంభోధౌ నౌకాం జడిమవిపినే పావకశిఖా-
మమర్త్యేంద్రాదీనామధిమకుటముత్తంస కలికామ్।
జగత్తాపే జ్యోత్స్నా మకృతకవచః పంజరపుటే
శుకస్త్రీం కామాక్ష్యా మనసి కలయే పాదయుగలీమ్॥

తల్లీ! ఈ సంసారము ఒక మహా సాగరమైతే, దానిని దాటించే నౌక నీ పాదములు. మా బుద్ధి హీనతను తొలగించే, ఔషధము నీ పాదములు. దేవతల కిరీటమునకు అలంకారములు, నీ పాదములు. వేదములనే పంజరములోని ఆడ చిలుక నీ పాదములు. అలాంటి పాద యుగళమును ధ్యానిస్తాను.

50. పరాత్మప్రాకాశ్యప్రతిఫలనచుంచుః ప్రణమతాం
మనోజ్ఞస్త్వత్పాదో మణిముకురముద్రాం కలయతే।

యదీయాం కామాక్షి ప్రకృతిమసృణాః శోధకదశాం
విధాతుం చేష్టంతే బలరిపువధూటీకచభరాః॥

అమ్మా కామాక్షీ! నిను శరణన్న వారికి నీ పాదములు ఒక దర్పణమువంటివి. వారి రూపము నీ పాదములలో ప్రతిబింబిస్తుంది. ఇంద్రపత్ని శచీదేవి, తన కురులను అలంకరించుకోడానికి నీ పాదములనే దర్పణముగా చేసుకుంటున్నది.

51. అవిశ్రాంతం తిష్ఠన్నకృతకవచః కందరపుటీ–
కుటీరాంతః ప్రౌఢం నఖరుచిసటాలీం ప్రకటయన్।
ప్రచండం ఖండత్వం నయతు మమ కామాక్షి తరసా
తమోవేతండేంద్రం తవ చరణకంఠీరవపతిః॥

అమ్మా! వేదములు అనే గుహలను నివాసముగా చేసుకుని ఉన్న మృగరాజు నీ చరణములు. తన పదునైన నఖముల ప్రకాశమనే జూలు విదుల్చుతూ, ఆ మృగరాజు నా అజ్ఞానము అనే మదగజమును చీల్చివేయుచున్నది.

52. పురస్తాత్కామాక్షి ప్రచుర రసమాఖండలపురీ–
పురంధ్రీణాం లాస్యం తవ లలితమాలోక్య శనకైః।
నఖశ్రీభిః స్మేరా బహు వితనుతే నూపురరవై–
శ్చమత్కృత్యా శంకే చరణయుగళీ చాటురచనాః॥

జగన్మాతా! నీ సమ్ముఖములో దేవ కన్యలు అద్భుతమైన నాట్యమును ప్రదర్శిస్తుండగా, నీ పాద నఖములకాంతి, నీ కాలికి ఉన్న అందియల చిరుసవ్వడులు, ఆ నాట్యమును ప్రశంసించు చున్నట్లుగా అనిపిస్తున్నది.

53. సరోజం నిందంతీ నఖకిరణకర్పూరశిశిరా
నిషిక్తా మారారేర్ముకుట శశిరేఖాహిమజలైః।
స్ఫురంతీ కామాక్షి స్ఫుటరుచిమయే పల్లవచయే
తవాధత్తే మైత్రీం పథికసుదృశా పాదయుగళీ॥

మాతా! పద్మముయొక్క కాంతిని తిరస్కరిస్తూ, నీ పాద నఖముల నుండి వెలువడే వెన్నెల పచ్చ కర్పూరమంత చల్లనిదై, చంద్రుని అమృత ధారలలో తడిసినదై, అనేకమైన లేలేత చిగురుటాకులవలే మెరిసిపోతున్నవి నీ చరణములు.

54. నతానాం సంపత్తేరనవరతమాకర్షణజపః
ప్రరోహత్సంసారప్రసరగరిమస్తంభనజపః।

త్వదీయః కామాక్షి స్మరహరమనోమోహనజపః
పటీయాన్నః పాయాత్పదనళిన మంజీరనినదః॥

కామాక్షీ! నిన్ను శరణు వేడినవారికి సకల ఐశ్వర్యములను ప్రసాదించే మంత్రమును, సంసార బాధలను తొలగించే మంత్రమును, ఈశ్వరునికి మోహన మంత్రమును ప్రసాదింపగల సమర్థములైనవి నీ పాదముల మంజీర నాదములు. ఆ నాదములు మమ్ము కరుణించుగాక.

55. వితన్వీథా నాథే మమ శిరసి కామాక్షి కృపయా
పదాంభోజన్యాసం పశుపరిబృఢప్రాణదయితే।
పిబంతో యన్ముద్రాం ప్రకటముపకంపాపరిసరం
దృశా నానంద్యంతే నలినభవనారాయణముఖాః॥

అమ్మా! ఆదిగురువైన ఈశ్వరునికి నీవు దేవేరివి. కంపానదీ తీరప్రాంతములో సంచరిస్తున్న నీ పాదపద్మములను బ్రహ్మాది దేవతలు కనులు విప్పార్చి మరీ తిలకిస్తుంటారు. అట్టి నీ పాదములను నా శిరసుపై ఉంచి నన్ను అనుగ్రహించు మాతా!

56. ప్రణామోద్యద్బృందారకముకుటమందారకలికా
విలోలల్లోలంబప్రకరమయధూమప్రచురిమా।
ప్రదీప్తః పాదాబ్జద్యుతివితతిపాటల్యలహరీ
కృశానుః కామాక్ష్యా మమ దహతు సంసారవిపినమ్॥

అమ్మా! దేవతలు నీకు నమస్కరించటానికి వంగినపుడు, వారి కిరీటములలోని ఎర్రని మణులనే మందార పుష్పములమీద తుమ్మెదల గుంపులు పరిభ్రమిస్తున్నాయి. నీ చరణముల కాంతి అనే ఎర్రని అగ్ని, సంసార బాధలు అనే నా అరణ్యమును జ్వలింపచేయుగాక.

57. వలక్షశ్రీరృక్షాధిపశిశుసదృక్షైస్తవ నఖైః
జిఘృక్షుర్దక్షత్వం సరసిరుహభిక్షుత్వకరణే।
క్షణాన్మే కామాక్షి క్షపితభవసంక్షోభగరిమా
వచోవైచక్షణ్యం చరణయుగలీ వక్ష్మలయాతాత్॥

అమ్మా! కామాక్షీ, పద్మములు నీ పాదములనుండి కాంతి అనే భిక్షను అర్థిస్తున్నాయి. చంద్రకాంతి వంటి నీ తెల్లని పాద నఖముల కాంతి, మా సాంసారిక బాధలను చిందరవందర చేసి, మా వాక్పటిమను వృద్ధిపరచుగాక.

58. సమంతాత్కామాక్షీ క్షతతిమిరసంతానసుభగాన్
అనంతాభిర్భాభిర్దినమను దిగంతాన్విరచయన్।


Kiron Type Institute

అహంతాయా హంతామమ జడిమదంతావలహరి
విభింతాం సంతాపం తవ చరణచింతామణిరసౌ॥

అమ్మా! నీ పాదములు చింతామణి వంటివి. అంతటా నిండి ఉన్న చీకటులను పారద్రోలి, అన్ని దిక్కులను వెలుగులతో నింపే నీ పాదములనే చింతామణి నాలో నిండి ఉన్న జడత్వము అనే భీకర గజమును తీసివేయుగాక.

59. దధానో భాస్వత్తామమృతనిలయో లోహితవపుః
విన్మ్రాణాం సౌమ్యో గురురపి కవిత్వం చ కలయన్।
గతౌ మందో గంగాధరమహిషి కామాక్షి భజతాం
తమఃకేతుర్మాతస్తవ చరణపద్మో విజయతే॥

అమ్మా! నీ పాదపద్మములు కాంతివంతమైన సూర్యుడు, అమృతమయుడైన చంద్రుడు, రక్తవర్ణముకల అంగారకుడు, సౌమ్యుడైన బుధుడు, గురుమూర్తియైన గురువు, కళలను ప్రసాదించే శుక్రుడు, మందుడైన శని, తమోగుణుడైన రాహువు, తోకచుక్క అయిన కేతువుల సమూహమే కదా!

60. నయంతీం దాసత్వం నలినభవముఖ్యానసులభ
ప్రదానార్ధీనానామమరతరుదౌర్భాగ్యజననీమ్।
జగజ్జన్మక్షేమక్షయవిధిషు కామాక్షి పదయో
ర్ధురీణామీష్టే కరస్తవ భణితుమాహోపురుషికామ్॥

జగన్మాతా! విశేషమేమిటంటే, దీనులైన వారికి, నీ పాదములు మోక్షాన్ని ప్రసాదిస్తూ, బ్రహ్మాది దేవతలకు దుర్లభమైనవిగా ఉన్నాయి. సృష్టి, స్థితి, లయ కార్యములను నిర్వహించేవి నీ పాదములు. అలాంటి పాదముల మహిమను వర్ణించడం ఎవరి తరమవుతుంది.

61. జనోయం సంతప్తో జనని భవచండాంశుకిరణైః
అలబ్ధ్వైకం శీతం కణమపి పరజ్ఞానపయసః।
తమోమార్గే పాంథస్తవ ఝటితి కామాక్షి శిశిరాం
పదాంభోజచ్ఛాయాం పరమశివజాయే మృగయతే॥

జగన్మాతా! నేను ఈ సంసార భ్రమణములో పడి, సంసారమనే సూర్యునియొక్క వేడి కిరణముల ధాటికి తాళలేక, జ్ఞానము అనే ఒక నీటి చుక్క కూడా దొరకక అలమటించు చున్నాను. బాటసారినైన నాకు, నీ పాదముల నీడను ప్రసాదించి సాంత్వనము కలుగచేయవమ్మా!

62. జయత్యంబ శ్రీమన్నఖకిరణచీనాంశుకమయం
వితానం బిభ్రాణే సురముకుటసంఘట్టమసృణే।
నిజారుణ్యక్షౌమాస్తరణవతి కామాక్షి సులభా
బుధైః సంవిన్నారీ తవ చరణమాణిక్యభవనే॥

తల్లీ! కామాక్షీ! నీ పాదపద్మములు మణి మాణిక్యములు కూర్చబడిన భవనము. ఆ భవనములో జ్ఞానులకు, యోగులకు సులభమైన ఒక తల్లి స్థితురాలై ఉన్నది. ఆ మండపము ఎలా ఉందో తెలుసా! దేవతల కిరీటములు పీఠముగా, రక్తవర్ణపు వస్త్రముపై, నఖకాంతులు పందిరిగా కలిగి ఆ తల్లి కూర్చుని ఉన్నది.

63. ప్రతీమః కామాక్షి స్ఫురితతరుణాదిత్యకిరణ
శ్రియో మూలద్రవ్యం తవ చరణమద్రీంద్రతనయే।
సురేంద్రాశామాపూరయతి యదసౌ ధ్వాంతమఖిలం
ధునీతే దిగ్భాగానపి చ మహసా పాటలయతే॥

అమ్మా! అప్పుడే ఉదయిస్తున్న భానుని కిరణములు నీ పాదములపై పడి ప్రకాశించుచున్నవి. ఓ హిమవత్పుత్రీ! అన్ని వైపులా వ్యాప్తమైన అంధకారమును పారద్రోలి, నీ పాదములు దిక్కులన్నిటినీ ఎర్రని కాంతిప్రకాశముతో నింపివేస్తాయి. ఆ కాంతిని నేను దర్శించగలుగుతున్నాను.

64. మహాభాష్యవ్యాఖ్యాపటుశయనమారోపయతి వా
స్మరవ్యాపారేర్ష్యాపిశున నిటిలం కారయతి వా।
ద్విరేఫాణామధ్యాస యతి సతతం వాధివసతిం
ప్రణమ్రాంకామాక్ష్యాః పదనలినమాహాత్మ్యగరిమా॥

అమ్మా! నీ పాదస్మరణ మాహాత్మ్యం ఎటువంటిదంటే, తనను శరణన్నవారిని విష్ణువు పాన్పు అయిన ఆదిశేషునివంటి వాక్పటిమను, ఈశ్వరుని తేజస్సును, బ్రహ్మత్వమును కలుగచేసి, త్రిమూర్తుల ఆశీస్సులను అందచేస్తుంది.

65. వివేకాంభస్స్రోతస్స్ను పనపరిపాటీశిశిరితే
సమీభూతే శాస్త్రస్మరణ హలసంకర్షణవశాత్।
సతాం చేతఃక్షేత్రే వపతి తవ కామాక్షి చరణో
మహాసంవిత్సస్యప్రకరవరబీజం గిరిసుతే॥

ఓ కామాక్షీ! నీ పాద స్మరణము అనే జలప్రవాహము నా మనసనే క్షేత్రమును పూర్తిగా తడిపి, వివేక జ్ఞానమనే నాగలితో దున్ని, మంత్ర బీజములను నాటి, కామ – క్రోధ – లోభ – మోహ – మద – మాత్సర్యాలు అనే కలుపు మొక్కలను ఏరివేస్తుంది.

66. దధానో మందారస్తబకపరిపాటీం నఖరుచా
వహన్దీప్తాం శోణాంగులిపటలచాంపేయకలికామ్।
అశోకోల్లాసం నః ప్రచురయతు కామాక్షి చరణో
వికాసీ వాసంతః సమయ ఇవ తే శర్వదయితే॥

మాతా! శివపత్నీ! మందార పుష్పముల వంటి నీ నఖముల కాంతి ప్రకాశముతో కూడిన రక్తవర్ణపు నీ పాదముల వేళ్ళు, వసంత ఋతువు లోని సంపెంగ మొగ్గలను, అశోక పుష్పములను తలపింపజేయుచున్నవి.

67. నఖాంశుప్రాచుర్యప్రసృమరమరాలాలిధవళః
స్ఫురన్మంజీరోద్యన్మరకతమహశ్శైవలయుతః।
భవత్యాః కామాక్షి స్ఫుటచరణపాటల్యకపటో
నదః శోణాభిఖ్యో నగపతితనూజే విజయతే॥

అమ్మా! నీ పాదనఖముల కాంతి ప్రసరించటం వలన నీవు నాటిన బీజములు అంకురించినవి. పైరు ఏపుగా పెరిగినది. ఆకుపచ్చ మణులతో కూర్చబడిన నీ పాదముల అందియలు ఆ పొలములో నాచువలే ఉన్నవి. ఎర్రని కొత్త నీటితో నిండిన శోణానది నా హృదయములో పరవళ్ళు త్రొక్కుగాక.

68. ధునానం పంకౌఘం పరమసులభం కంటకకులైః
వికాసవ్యాసంగం విదధదపరాధీనమనిశమ్।
నఖేందుజ్యోత్స్నాభిర్విశదరుచి కామాక్షి నితరామ్
అసామాన్యం మన్యే సరసిజమిదం తే పదయుగమ్॥

అమ్మా! ఏపుగా పండిన పంట ఇల్లు చేరటం ఎలా. తెల్లని కాంతి కలిగిన నఖములు కల నీ పాద పద్మములు అనవసరముగా పేరుకున్న మకిలిని, కీటకములనే దుష్టులను దూరముగా తరిమివేసి, నీ కరుణ అనే పంటను నా హృదయమనే గృహమునకు చేరుస్తాయి.

69. కరీంద్రాయ ద్రుహ్యత్యలసగతిలీలాసు విమలైః
పయోజైర్మాత్సర్యం ప్రకటయతి కామం కలయతే।

పదాంభోజద్వంద్వం తవ తదపి కామాక్షి హృదయం
మునీనాం శాంతానాం కథమనిశమస్మై స్పృహయతే॥

అమ్మా! అతి నెమ్మదిగా నడుస్తున్న నీ పాదములను చూసి, ఏనుగులు చిన్నబుచ్చుకుంటున్నాయి. సున్నితమైన నీ పాదములను చూసి పద్మములు ఓర్వలేకపోతున్నాయి. తపోసంపన్నులైన మునులు నీ పాదములను ఆశ్రయిస్తూనే ఉన్నారు.

70. నిరస్తా శోణిమ్నా చరణకిరణానాం తవ శివే
సమింధానా సంధ్యారుచిరచలరాజన్యతనయే।
అసామర్థ్యాదేనం పరిభవితుమేతత్సమరుచాం
సరోజానాం జానే ముకులయతి శోభాం ప్రతిదినమ్॥

అమ్మా! నీ చరణకాంతుల ఎర్రని ప్రకాశము, సంధ్యాకాంతులను పరిహసిస్తున్నది. నీ పాదముల కాంతిని అవి ఏమీ చేయలేక, సంధ్యాకాంతులు తమతో సమమైన కాంతిగల పద్మములు ముకుళించేలా చేస్తున్నాయి.

71. ఉపాదిక్షద్దాక్ష్యం తవ చరణనామా గురురసౌ
మరాలానాం శంకే మసృణగతిలాలిత్యసరణౌ।
అతస్తే నిస్తంద్రం నియత మమునా సఖ్యపదవీం
ప్రపన్నం పాథోజం ప్రతి దధతి కామాక్షి కుతుకమ్॥

అమ్మా! కామాక్షీ! తమ నడకలు ఎలా ఉండాలో తెలియక సంచరిస్తున్న హంసలకు, – ఎంతో సులభమైన పద్ధతిలో, ఎంతో సుకుమారంగా వయ్యారముగా, వాటికి నడకలు నేర్పినవి నీ పాదములు. – అందుకనే హంసలు నీ పాద పద్మములతో చెలిమికి తహతహలాడుతున్నాయి.

72. దధానైః సంసర్గం ప్రకృతిమలినైః షట్పదకులైః
ద్విజాధీశశ్లాఘావిధిషు విదధద్భిర్ముకులతామ్।
రజోమిశ్రైః పద్మైర్నియతమపి కామాక్షి పదయోః
విరోధస్తే యుక్తో విషమశరవైరిప్రియతమే॥

జగన్మాతా! సహజముగా, తుమ్మెదలు నల్లని రంగులో ఉండే చంచలమైనవి. ఆ తుమ్మెదలను ఆకర్షించేవి పద్మములు. పైగా చంద్రుని చూడగానే అవి ముఖం ముడుచుకుంటాయి. కానీ, ఈ స్వభావములు కేవలము సృష్టి ధర్మమే కానీ వాటికి స్వాభావికం కాదు. కాబట్టి వానితో నీ పాదాలకు వైరమెందుకమ్మా!

73. కవిత్వశ్రీ మిశ్రీకరణనిపుణౌ రక్షణచణౌ
విపన్నానాం శ్రీమన్నళినమసృణౌ శోణకిరణౌ।
మునీంద్రాణాంమంతః కరణశరణౌ మందసరణౌ
మనోజ్ఞౌ కామాక్ష్యా దుతహరణౌ నౌమి చరణౌ॥

కవిత్వ పటిమను వృద్ధిపరచి, దుఃఖపీడితులైనవారిని దయచూచి, ఎరుపురంగు ప్రకాశముతో, యోగీశ్వరుల అంతరంగములలో విహరిస్తూ, పాపక్షయము చేస్తూ, నెమ్మదిగా సంచరించే అమ్మ పాదములకు నమస్కరిస్తున్నాను.

74. పరస్మాత్సర్వస్మాదపి చ పరయోర్ముక్తికరయోః
నఖశ్రీభిర్జ్యోత్స్నా కలితతులయోస్తామ్రతలయోః।
నిలీయే కామాక్ష్యా నిగమనుతయోర్నాకినతయోః
నిరస్తప్రోన్మీలన్నళినమదయోరేవ పదయోః॥

అమ్మా! ముక్తిదాయకములు, వెన్నెల కాంతినిమించిన నఖ కాంతులు కలవి, వేదములచేత, దేవతలచేత కీర్తించబడేవి, కమలముల కాంతిని మించిన కాంతికలవి అయిన పాదములలో నేను ఐక్యమవుతాను.

75. స్వభావాదన్యోన్యం కిసలయమపీదం తవ పదం
మ్రదిమ్నా శోణిమ్నా భగవతి దధాతే సదృశతామ్।
వనే పూర్వస్యేచ్ఛా సతతమవనే కిం తు జగతాం
పరస్యేత్థం భేదః స్ఫురతి హృది కామాక్షి సుధియామ్॥

అమ్మా! నీ చరణములు, లేత చిగురుటాకులు రెండింటికి సామ్యం ఉంది. రెండూ కూడా ఎరుపు వర్ణముతో, సున్నితంగా ఉంటాయి. అయితే ఆలోచించగా, చిగురుటాకు అడవిలో ఉంటే, నీ పాదములు మాత్రం సంసారమనే ఆ అడవిని ఎల్లప్పుడూ సంరక్షిస్తూనే ఉంటాయి.

76. కథం వాచాలోపి ప్రకటమణిమంజీరనినదైః
సదైవానందార్ద్రాన్విరచయతి వాచంయమజనాన్।
ప్రకృత్యా తే శోణచ్ఛవిరపి చ కామాక్షి చరణో
మనీషానైర్మల్యం కథ మివ నృణాం మాంసలయతే॥

మాతా! కామాక్షీ! నీ పాదములకు ఉన్న అందియలు ఎప్పుడూ శబ్దంచేస్తూ మాట్లాడుతుంటాయి. కానీ అవి మౌన మునీంద్రులచే ఆరాధించబడుతుంటాయి. రజో గుణ


Kiron Type Institute

వర్ణమైన నీ ఎర్రని పాదములు మానవులకు సత్వగుణమైన పవిత్ర జ్ఞానమును ప్రసాదిస్తాయి. పరస్పరవిరుద్ధమైన భావములు కలవి నీ పాదములు.

77. చలత్తృష్ణావీచీపరిచలనపర్యాకులతయా
ముహుర్భ్రాంతస్తాంతః పరమశివవామాక్షి పరవాన్।
తితీర్షుః కామాక్షి ప్రచురతరకర్మాంబుధిమముం
కదాహం లప్స్యే తే చరణమణిసేతుం గిరిసుతే॥

అమ్మా! ఈ సంసారము ఆశలను రేపెట్టుతూ కలతలను కలిగిస్తుంది. ఈ సంసారమునకు, నీ సమ్ముఖమునకు వారధి నీ పాద పద్మములు. సంసారము అనే సాగరమును దాటడానికి నేను నీ పాదపద్మములనే వారధిని ఎప్పుడు దాటగలనో కదా!

78. విశుష్యంత్యాం ప్రజ్ఞాసరితి దురితగ్రీష్మసమయ
ప్రభావేణ క్షీణే సతి మమ మనఃకేకిని శుచా।
త్వదీయః కామాక్షి స్ఫురితచరణాంభోదమహిమా
నభో మాసాటోపం నగపతిసుతే కిం న కురుతే॥

అమ్మా! పర్వతరాజపుత్రీ! పాపములు అనే ప్రచండమైన ఎండ వేడిమికి నాలోని కొద్దిపాటి జ్ఞానము ఆవిరైపోతున్నది. నా మనసు అనే మయూరము ఎంతో అలమటిస్తున్నది. కేవలము నీ పాదమనే శ్రావణ మాసపు మేఘములే నా మనసనే మయూరమునకు ఆహ్లాదమును కలిగించగలవు.

79. వినమ్రాణాం చేతోభవనవలభీసీమ్ని చరణ
ప్రదీపే ప్రాకాశ్యం దధతి తవ నిర్ధూతతమసి।
అసీమా కామాక్షి స్వయమలఘుదుష్కర్మలహరీ
విఘూర్ణంతీ శాంతిం శలభపరిపాటీవ భజతే॥

అమ్మా! నీ పాదములకు నమస్కరించే వారి భవనములోని అంధకారమును తొలగిస్తూ, నీ పాదములనే మణిదీపములను ప్రకాశింపచేస్తున్నావు. మా పాపకర్మలనే మిడతలదండు, వాటంతట అవి, నీ పాద శిఖలనే జ్వాలలో పడి భస్మమై పోవుచున్నవి.

80. విరాజంతీ శుక్తిర్నఖకిరణముక్తామణితతేః
విపత్పాథోరాశౌ తరిరపి నరాణాం ప్రణమతామ్।
త్వదీయః కామాక్షి ధ్రువమలఘువహ్నిర్భవవనే
మునీనాం జ్ఞానాగ్నేరరణిరయ మంఘిర్విజయతే॥

అమ్మా! నీ చరణములు ముత్యపుచిప్పలైతే, నీ నఖములకాంతులు ఆ చిప్పలలో జనించిన ముత్యములు. నిన్ను శరణన్నవారిని – సంసారమనే సముద్రమును దాటించే నావ, సంసార అరణ్యమునకు దావాగ్ని, మునులలో జ్ఞానాగ్ని అయిన నీ పాదములకు నమస్కరించుచున్నాను.

81. నమస్త్రైః సంసేవ్యః సతతమపి కామాక్షి విబుధైః
స్తుతో గంధర్వస్త్రీసులలిత విపంచీకలరవైః।
భవత్యా భిందానో భవగిరికులం జృంభితతమో
బలద్రోహీ మాతశ్చరణపురుహూతో విజయతే॥

అమ్మా! కామాక్షీ! నిరంతరము దేవతల స్తుతులనందుకుంటూ, దేవతా స్త్రీల మనోహర గానముతో, వారి నాదముల ధ్వనులతో నీ పదములు సేవింపబడుతుంటాయి. ఒక వేళ దేవేంద్రుడే నీ పాదముగా అమరలేదుకదా! ఎందుకంటే, సంసారము అనే ఈ పర్వతమును దేవేంద్రుడు మాత్రమే వజ్రాయుధముతో పిండి చేయగలడుకదా!

82. వసంతం భక్తానామపి మనసి నిత్యం పరిలసద్
ఘనచ్ఛాయాపూర్ణం శుచిమపి నృణాం తాపశమనమ్।
నఖేందుజ్యోత్స్నాభిః శిశిరమపి పద్మోదయకరం
నమామః కామాక్ష్యాశ్చరణమధికాశ్చర్యకరణమ్॥

అమ్మా! నీ పాదపద్మములు వసంత కాలంలో భక్తుల మనసులో కొలువై, వర్ష ఋతువులో నీలిమేఘఛాయతో ఉండి, గ్రీష్మఋతువులో తాపమును హరిస్తూ, శిశిర ఋతువులో చల్లని వెన్నెల కాంతిని చిందిస్తూ, శరత్ కాలములో పద్మములను వికసింపచేస్తూ, ఋతువులు వేరైనా, నీ ధర్మం భక్తరక్షణమే.

83. కవీంద్రాణాం నానాభణితిగుణచిత్రీకృతవచః
ప్రపంచ వ్యాపారప్రకటనకలాకౌశలనిధిః।
అధఃకుర్వన్నబ్జం సనకభృగుముఖ్యైర్మునిజనైః
నమస్యః కామాక్ష్యాశ్చరణపరమేష్ఠీ విజయతే॥

జగదంబా! పద్మాసనాసీనుడైన బ్రహ్మదేవుడు అనేక రకములుగా, అనేక గుణములతో సృష్టి రచన చేయటం, చతుర్ముఖములతో వేద పఠనం చేయటం, పద్మాసనాసీనములైన నీ పాదముల కరుణా కటాక్షము చేతనే కదా!

84. భవత్యాః కామాక్షి స్ఫురితపదపంకేరుహభువాం
పరాగాణాం పూరైః పరిహృతకలంకవ్యతికరైః।

నతానామామృష్టే హృదయముకురే నిర్మలరుచి
ప్రసన్నే నిశ్శేషం ప్రతిఫలతి విశ్వం గిరిసుతే॥

మాతా! నగరాజ సుతా! భక్తులు నీ చరణములకు నమస్కరించినపుడు, వారి హృదయమనే దర్పణంపై ఉన్న ధూళిని, నీ పాద రజముచేత శుద్ధిపరుస్తావు. అప్పుడు నీ పవిత్ర రూపము వారి హృదయమనే అద్దములో ఎంతో స్పష్టముగా ద్యోతక మవుతుంది.

85. తవ త్రస్తం పాదాత్కిసలయ మరణ్యాంతరమగాత్
పరం రేఖారూపం కమలమముమేవాశ్రితమభూత్।
జితానాం కామాక్షి ద్వితయమపి యుక్తం పరిభవే
విదేశే వాసో వా శరణగమనం వా నిజరిపోః॥

మాతా! లేత చిగురుటాకులు, సుందర పద్మములు, నీ పాదముల ధాటికి తట్టుకొనలేక, చిగురుటాకేమో తాను వెళ్ళిపోయి, అరణ్యములో దాక్కున్నది. కానీ, పద్మమేమో, తనను నీ పాదమునకు ఛాయగా భావించి నీ పాదమును తన శిరసుపై ఉంచుకున్నది.

86. గృహీత్వా యాథార్థ్యం నిగమవచసాం దేశికకృపా
కటాక్షార్కజ్యోతిశ్శమితమమతాబంధతమసః।
యతంతే కామాక్షి ప్రతిదివస మంతర్ద్రఢయితుం
త్వదీయం పాదాబ్జం సుకృతపరిపాకేన సుజనాః

మాతా! గురువు యొక్క ప్రకాశమైన కాంతి, శిష్యుని అజ్ఞానము అనే చీకటిని పటాపంచలు చేస్తుంది. ఆ జ్ఞానులైన గురువులు మాత్రం నీ పాదములనే, తమ గురువులుగా భావించి, వదలక తమ హృదయములో నిలుపుకుంటారు.

87. జడానామప్యంబ స్మరణసమయే త్వచ్చరణయోః
భ్రమన్మంథక్ష్మాభృద్ఘుమఘుమితసింధుప్రతిభటాః।
ప్రసన్నాః కామాక్షి ప్రసభమధరస్పందనకరాః
భవంతి స్వచ్ఛందం ప్రకృతిపరిపక్వా భణితయః॥

అమ్మా! చదువుసంధ్యలు లేని మందమతులైనా, నీ పాదములను ఆశ్రయించినంత మాత్రమున, అనంతమైన కావ్య పటిమను పొందగలుగుతారు. ఆ కావ్య సంపద ఎటువంటిదంటే, క్షీర సముద్ర మధన సమయములో ఆవిర్భవించిన అమృతమంత తీయనిది.

88. వహన్నప్యశ్రాంతం మధురనినదం హంసకమసౌ
తమేవాధః కర్తుం కిమివ యతతే కేళిగమనే।

భవన్త్యేవానందం విదధదపి కామాక్షి చరణో
భవత్యాస్తద్ద్రోహం భగవతి కిమేవం వితనుతే॥

అమ్మా! నీ చరణముల అందెలు తమ సవ్వడితో నీకు ఆనందాన్ని కలుగ చేస్తుంటే, అదే అందెల సవ్వడి హంసనడకలను తిరస్కరిస్తున్నది. నీ అవే పాదములు శివునకు మోదమును కలిగిస్తుంటే, మరొకప్రక్క అవి సంసారబాధలను తొలగింపచేస్తున్నాయి.

89. యదత్యంతం తామ్యత్యలసగతివార్తాస్వపీ శివేః
తదేతత్కామాక్షి ప్రకృతిమృదులం తే పదయుగమ్।
కిరీటైః సంఘట్టం కథమివ సురౌఘస్య సహతే
మునీంద్రాణామాస్తే మనసి చ కథం సూచినిశితే॥

అమ్మా! ఒక విషయం నాకు అర్థం కావడం లేదు. సున్నితమైన, మృదువైన నీ పాదములు, నీకు పాద నమస్కారములు చేసేటపుడు, దేవతల కిరీటముల మణులు అనే రాళ్ళ ఒరిపిడిని ఎలా భరించాయమ్మా! ఆ ఒరిపిడిని భరిస్తూ కూడా, వారి హృదయములలో సంచరించడం మాత్రం నీకే తగును.

90. మనోరంగే మత్కే విబుధజనసమ్మోదజననీ
సరాగవ్యాసంగం సరసమృదుసంచారసుభగా।
మనోజ్ఞా కామాక్షి ప్రకటయతు లాస్యప్రకరణం
రణన్మంజీరా తే చరణయుగలీనర్తకవధూః॥

అమ్మా! నీ పాద యుగళి, ఒక అద్భుతమైన నాట్యగత్తె. ఆ పాదములజంట, నా మనసును ఒక రంగస్థలముగా చేసుకుని, దేవతా సమూహమునకు, జ్ఞానులకు సంతోష ప్రదమై, మనోహరమైన నీ అందెల సవ్వడి ప్రతిధ్వనిస్తుండగా, ఒక అద్భుతమైన నాట్యమును ఆవిష్కరించాలి.

91. పరిష్కుర్వన్మాతః పశుపతికపర్దం చరణరాట్
పరాచాం హృత్పద్మం పరమభణితీనాం చ మకుటమ్।
భవాఖ్యే పాథోధౌ పరిహరతు కామాక్షి మమతా
పరాధీనత్వం మే పరిముషితపాథోజమహిమా॥

అమ్మా! నీ చరణములు పద్మముల ప్రకాశమును స్వంతము చేసుకున్నవి. అట్టి పాదములు మమత్వముతో పూర్తిగా నిండిపోయిన నా హృదయమును శుద్ధిపరచుగాక. వేదములచే సర్వదా కీర్తింపబడునవై, మునీశ్వరుల హృదయములలో స్థితమైనవి నీ పాదములు.


Kiron Type Institute

92. ప్రసూనైః సంపర్కాదమరతరుణీకుంతలభవైః
అభీష్టానాం దానాదనిశమపి కామాక్షి న మతామ్।
స్వసంగాత్కంకేళిప్రసవజనకత్వేన చ శివే
త్రిధా ధత్తే వార్తాం సురభిరితి పాదో గిరిసుతే॥

ఓ కామాక్షీ! నీ పాదములు దేవతాస్త్రీల సిగలలోని అశోక పుష్పములను స్పృశించి, వారి కోరికలను తీర్చి, వారిని నిత్యపరిమళవంతులుగా చేయటం, కామధేనువువలె కోరికలను తీర్చడం, మొదలైన ప్రక్రియల వలన ఆ దేవతాస్త్రీలకు సురభియగుచున్నవి.

93. మహామోహాస్తేనవ్యతికరభయాత్పాలయతి యో
వినిక్షిప్తం స్వస్మిన్నిజజనమనోరత్నమనిశమ్।
స రాగస్యోద్రేకాత్సతతమపి కామాక్షి తరసా
కిమేవం పాదోసౌ కిసలయరుచిం చోరయతి తే॥

అమ్మా! జ్ఞానులు, మోహమనే దొంగ తమ హృదయమనే రత్నమును దొంగిలిస్తాడేమో అనే భయముతో దానిని నీ పాదములనే పెట్టెలో దాచారు. ఆ రత్నము పట్ల జగన్మాత ఎంతో అనురాగము పెంచుకున్నది. ఇంతకంటే వారు కోరుకునేదేమున్నది తల్లీ!

94. సదా స్వాదుంకారం విషయలహరీశాలికణికాం
సమాస్వాద్య శ్రాంతం హృదయశుకపోతం జనని మే।
కృపాజాలే ఫాలేక్షణమహిషి కామాక్షి రభసాత్
గృహీత్వా రుంధీథారస్తవ పదయుగీపంజరపుటే॥

మాతా! త్రినేత్రుని దేవేరీ, నా మనసు అనే చిలుక ఇహ భోగములకు అలవాటుపడి, ఆ గింజలను తినీ తినీ ఆయాసపడుతున్నది. ఆ చిలుకను నీ కరుణ అనే వలలో బంధించి, నీ చరణ పంజరములో కదలకుండా ఉంచు.

95. ధునానం కామాక్షి స్మరణలవమాత్రేణ జడిమ
జ్వరప్రౌఢిం గూఢస్థితి నిగమనైకుంజకుహరే।
అలభ్యం సర్వేషాం కతిచన లభంతే సుకృతినః
చిరాదన్విష్యంతస్తవ చరణసిద్ధౌషధమిదమ్॥

జగన్మాతా! నేను అనేక విష జ్వరములతో బాధపడుతున్నాను. దానికి దివ్య ఔషధం నీ పాదములే. ఆ ఔషధం నా హృదయమనే అరణ్యంలోనే దాగి ఉంది. దానిని వెదికి బయటకు తీసి సేవించినపుడే, నా వ్యాధులు నయమవుతాయి.

96. రణన్మంజీరాభ్యాం లలితగమనాభ్యాం సుకృతినాం
మనోవాస్తవ్యాభ్యాం మథితతిమిరాభ్యాం నఖరుచా।
నిధేయాభ్యాం పత్యా నిజశిరసి కామాక్షి సతతం
నమస్తే పాదాభ్యాం నళినమృదులాభ్యాం గిరిసుతే॥

అమ్మా! కామాక్షీ! సుందరమై, మధురమైన అందెల సవ్వడులతో, జ్ఞానుల హృదయములలో వసిస్తూ, నఖ కాంతులచే అజ్ఞానమును పారద్రోలుతూ, తన పతిదేవుడైన ఈశ్వరునిచే శిరో భాగమున భద్రపరచుకున్న నీ పాదములకు ప్రణమిల్లు తున్నాను.

97. సురాగే రాంకేందుప్రతినిధిముఖే పర్వతసుతే
చిరాల్లభ్యే భక్త్యా శమధనజనానాం పరిషదా।
మనోభృంగో మత్కః పదకమలయుగ్మే జనని తే
ప్రకామం కామాక్షి త్రిపురహరవామాక్షి రమతామ్॥

జననీ! త్రిపురములను కూల్చిన ఈశ్వరుని దేవేరీ, మచ్చ లేని పౌర్ణమి చంద్రబింబమును పోలిన ముఖము కల మాతా! గిరిరాజపుత్రీ! ఇంద్రియములను, శమదమాదులను జయించిన వారికి మాత్రమే లభ్యమయే నీ పాద పద్మములలో నా మనసు తుమ్మెదవలె విహరించుగాక!

98. శివే సంవిద్రూపే శశిశకలచూడప్రియతమే
శనైర్గత్యాగత్యా జితసురవరేభే గిరిసుతే।
యతంతే సంతస్తే చరణనళినాలానయుగళే
సదా బద్ధం చిత్తప్రమదకరియూథం దృఢతరమ్॥

మాతా! బాలచంద్రుని శిరసున ధరించి, నీ అతి మెల్లని పాదచలనముతో, ఇంద్రవాహన మైన ఐరావతమును సైతం నివ్వెరపరచిన కామాక్షీ, జ్ఞానులు, జ్ఞానమనే బలమైన త్రాళ్లతో, మదపుటేనుగు వంటి తమ మనసును నీ పాదములనే గుంజలకు కట్టివేస్తారు.

99. యశః సూతే మాతర్మధురకవితాం పక్ష్మలయతే
శ్రియం దత్తే చిత్తే కమపి పరిపాకం ప్రథయతే।
సతాం పాశగ్రంథిం శిథిలయతి కిం కిం న కురుతే
ప్రపన్నే కామాక్ష్యాః ప్రణతిపరిపాటీ చరణయోః॥

శ్రీ కామాక్షీ దేవికి పాద నమస్కారము చేసినవారికి లభించనిదేమైనా ఉంటుందా! చిర యశస్సు, కవితా పటిమ, పరిపక్వమైన మనసు, మోహమనే పాశమును తొలగించుట, ఇలా ఆ తల్లి కురణిస్తే ఏమైనా చేయకలదు.

100.మనీషాం మాహేంద్రీం కకుభమివ తే కామపి దశాం
ప్రధత్తే కామాక్ష్యాశ్చరణతరుణాదిత్యకిరణః।
యదీయే సంపర్కే ధృతరస మరందా కవయతాంః
పరీపాకం ధత్తే పరిమళవతీ సూక్తినళినీ॥

కామాక్షీ దేవి పాదములు ఉదయిస్తున్న సూర్య కిరణములు. అవి తూర్పు కొండలలో ఉదయించి, బుద్ధిని వికసింపచేసి, తద్వారా, వికసించిన బుద్ధినుండి, మధురమైన కవితా ధారలను వర్షింపచేస్తాయి.

101.పురా మారారాతిః పురమజయదంబ స్తవశతైః
ప్రసన్నాయాం సత్యాం త్వయి తుహినశైలేంద్రతనయే।
అతస్తే కామాక్షి స్ఫురతు తరసా కాలసమయే
సమాయాతే మాతర్మ మ మనసి పాదాబ్జయుగళమ్॥

అమ్మా! నగరాజపుత్రీ! కామాక్షీ! ఈశ్వరుడు నిన్ను అనేక స్తోత్రములతో స్తుతించి, నీ కరుణను పొందిన తరువాతే త్రిపురములను కూల్చివేశాడు. జగన్మాతా, అలాగే, నా ప్రాణత్యాగ సమయములో, నీవు నీ చరణములను ప్రకాశింపచేస్తేనే కదా నేను ఆ పాదములలో ఐక్యమవగలను.

102.పదద్వంద్వం మందం గతిషు నివసంతం హృదిసతాం
గిరామంతే భ్రాంతం కృతకరహితానాం పరిబృఢే।
జనానామానందం జనని జనయంతం ప్రణమతాం
త్వదీయం కామాక్షి ప్రతిదినమహం నౌమి విమలమ్॥

జననీ! కామాక్షీ! మెల్లగా సంచరిస్తూ, సత్పురుషుల హృదయములలో వసిస్తూ, వేదసంచారిణివై, శరణన్న భక్తులను కరుణించే నీ పాదాలకు నిత్యం సాష్టాంగముగా ప్రణమిల్లుతాను.

103.ఇదం యః కామాక్ష్యాశ్చరణనళినస్తోత్రశతకం
జపేన్నిత్యం భక్త్యా నిఖిలజగదాహ్లాదజనకమ్।
స విశ్వేషాం వంద్యః సకల కవిలోకైక తిలకః
చిరం భుక్త్వా భోగాన్పరిణమతి చిద్రూపకలయా॥

సకల జగములకు ముక్తిని ప్రసాదించే ఈ పాదారవింద శతకమును భక్తితో జపించేవారు, ఈ లోకములోని అందరిచే నమస్కరించబడుతారు. కవీశ్వరులుగా సుప్రసిద్ధులవుతారు. భోగ భాగ్యములను పొంది అమ్మ పాదారవిందములలో ఐక్యమవు తారనేది సత్యం.

// మూకపంచశతి లోని రెండవదైన "పాదారవింద శతకం" సంపూర్ణమ్ // (తరువాతది స్తుతి శతకం)

